## రెండవ ప్రకరణము.

### విజయారంభము.

ఒకనాఁడు త్రిజగద్వ్యాపియగు సూర్యభగవానుఁడు ప్రజాపరిశ్రమ కూర్పతింగని కోపారుణితమూర్తియై యరుణకిరణంబుల నలుదెసలఁ జిమ్ముచుఁ దూర్పుదెసనుండి బయలుదేరి వచ్చుచుండెను. గృహస్థజనులు ప్రాతఃకాలానుష్ఠానములఁ దీర్చి తమ తమ వ్యాయామములకై కేగుచుండిరి. పశుగణంబులు తమ నెలవులనుండి విడువంబడి మెల్ల మెల్లన సూర్యకిరణస్పర్శమునకు సంతసిల్లుచుఁ బొలముల కేగుచుండెను. కొలఁది దూరమునందుండు జనపదములనుండి పాలు, పెరుగు, కూరగాయలు మున్నగు పదార్థముల మోసికొనివచ్చు స్త్రీ పురుషులు వీధులయందుఁ దిరుగాడుచు గేకలు వైవసాగిరి. ఎల్లవీధులయందుఁ బ్రజాకోలాహలంబులు విస్తరిల్లె. సింహపురి బ్రాహ్మణవీధియందొక బాలుఁడు పశ్చిమాభిముఖుండై మెల్లగ నరుగుచుండె. ఆబాలున కించుమించు పదునారేండ్ల ప్రాయముండును. అతనికి హృదయంగమంబగు వదనబింబంబును, విశాలమగు వక్షస్థలంబును గలదు. కాంతిమంతమై నలరారు మేనిచాయయు, విశదమగు కన్నుంగవయుఁ గలదు. ఈసుందరపురుషుఁడెద్దియో చింతించుచున్నవానివలెఁ గన్పట్టుచు నల్లనల్ల నటు నిటు నడయాడుచుండెను. చిన్నతలంగ ఖండింపఁబడి కత్తెర పాపటచే విడఁదీయఁబడియున్న యాతని ముంగురులు ఫాలభాగమ్ములఁ గ్రిందగ వంపదలై మొగంబున ముద్దువుట్టించుచుండెను. తెల్లని వలువలు ధరించి తలపైనొక పట్టుటోపి నలరించి, కళుకైన యంగీలం దొడఁగి, పాదంబుల మోజాలంగ్రుచ్చి, యొకచేత నాతపత్రమునుంగొని, సాలోచనవదనుండై యరుగుచున్న యీబాలుని గమన మతి మనోజ్ఞముగ నుండెను. అతఁడు కొంతతడవా వీధిని జనిచని తుదకొక భవనద్వారమున నిలువంబడెను. తద్భవనంబు ప్రాగ్దిశాముఖంబై యుండుటం జేసి, తరణికిరణముల నరుణితంబై ప్రకాశిల్లుచుండెను. వసుధాపూర్ణమై కైలాసగిరిం బోలిన యా సౌధరాజంబు నూతననిర్మితము గాఁ గానవచ్చెడిని. విశాలములగు గవాక్షములు మూయుటకై వివిధవర్ణములైన యద్దంపు దలుపు లమర్పబడియుండె. చిత్రచిత్రములగు చిత్తరువు లామేడపై నచ్చటచ్చటఁ జిత్రింపఁబడియె. ద్వారమున కిరుదెసల లక్ష్మీవిగ్రహములు విరాజిల్లుచుండెను. ఆ విగ్రహముల యునికిం జేసి యీసౌధము కలిమికల జవరాలికి నిలయంబో యనుమాడ్కి విలసిల్లుచుండె. ఆబాలుఁ డిది యొక మహాధనికుని గృహావాసంబని యూహసేసె.

ఆ బాలుండా సదనద్వారమున నిలువంబడి వాకిట నిలువంబడియున్న ద్వారపాలకుంగనుంగొని యజమానుఁ డింటనుండె నెఱిఁగి యొకఁడో చూడవచ్చియున్నా

గని వచ్చు మనెను. పరిచారకుఁడంత లోనికిం జని మరలి వచ్చి యాపురుషుని లోనున్న గదిలోనికిం జనుమని చెప్పెను. ఆగది మిగుల విశాలముగను దర్శనీయముగను నొప్పుచుండెను. అందు పలుదెసల ననేక పుస్తక భాండారంబులు నమరియుండె. బాలుండు తదంతః ప్రదేశమునకుఁ జనువేళ నిరువురు పురుషులు సుఖాసనాసీనులై యుండిరి. వారిలో నొకండు నలువదియైదు వర్షములు పైబడినవాఁడు గంభీరవదనమును గురుకాయమును గలిగియున్నవాఁడు. ఒక చేతఁగొన్ని కాగితములు గలిగియున్నవాఁడు రెండవవాఁడు ముప్పది వర్షములకు లోనైనవాఁడు అతఁడు సువర్ణఘటికాయంత్రములం గలిగి చక్కని జరీపరిధానముం దాల్చి ధనికుఁడుగఁ గన్పట్టుచుండెను. ప్రథమ పురుషుఁడు సింహపురమునంగల న్యాయవాది బృందమునకెల్లఁ బెద్దయై యనేకవర్షములనుండి యపారధనము నార్జించినవాఁడు. అతని చెంతం గూరుచుండిన ద్వితీయపురుషుండు సింహపురంబునఁ గాపురమున్న యొకానొక భూస్వామి వీరిరువురకును నడిమిదూరమున నిరువురు లేఖకులు క్రిందఁ గూర్చుండి యేమేమో లిఖించుచుండిరి.

పైఁ జెప్పిన బాలకుఁడు గదిలోనికిం జనువేళ వారిట్టుల మాటాడుకొనుచుండిరి.

ప్ర.—ఈ వ్యవహారము విషయమై యెంతయు నాలోచించితిని. ఎంత చూచినను నేమియు నాధారము కనఁబడదయ్యె.

ద్వి.—అయ్యా! యితరు లెవ్వరివలనను గాదని మీచెంతఁ జేరితిని. ఈ వ్యవహారమున నెంతి ధనంబయిన వ్యయంబవుగాక. మీరు వలయునంత ధనమిచ్చుటకు సిద్ధముగా నున్నాఁడను. నాకు జయవాక్యము వినిపించుమార్గము నూహింతురుగాక.

ప్ర.—కేవల మాధారహీనమైన వ్యవహారమున నెంతధనము వ్యయపెట్టిన నేమి ప్రయోజనము? అయ్యా! మీరు మఱల సాయంకాలము రండు ఆలోచించెదను.

ద్వి.—అయ్యా నమస్కారము సెలవొసంగుఁడు అని నిష్క్రమింపఁ బ్రథమపురుషుఁడును గృహాంతర్వర్తి జనాహూయమానుండై లోనికిం బ్రవేశించె. బాలుఁడును బ్రథమపురుష పునర్దర్శనమునకై నిరీక్షించుచు నందె కూర్చుండెను.

---

## మూఁడవ ప్రకరణము.

### దురవస్థ.

ఒకనాఁటి సాయంకాలమునఁ జిన్నిరాయనిపురంబను నొక జానపదంబున వేశ్యాగృహంబున నొక వితంతువిట్లు విలపింపసాగెను. « అయ్యో! నే నెంత పాపకర్మురాలను? ఎంత దురదృష్టవంతురాలను? ప్రొద్దున నిద్రలేచినది మొదలు సూర్యాస్తమయమువఱకు నొరులకు జంకియే సంచరింపవలయునుగదా? ఎవరో కార్యమున బోవుచు « నీవెదురుగ వచ్చితివి. నా కార్యము నిరర్థకమయ్యె » నని తూలనాడెదరో అని భీతి చెందవలయును. ప్రొద్దుప్రొద్దున నిద్దురలేచి స్నానమాడి, ఎవడు ననుఁ గని «అమ్మా ప్రొద్దుననె యెదురుగ రావలయునా? నీ మొగము చూచుటంబట్టియీనాఁడెట్టి నష్టములో కదా? » యని దూఱుకరే అని కొంత భయము. తోడియాఁడువారల తోడ రంగుల చీరలను రైకలను దొడిగికొని, తిలకమ్ము దిద్దుకొని నేను మాత్రమేల సంచరింపరాదు? వీనికేమి? అకటా యింక నాకు సాధియేమి? ఎవ్వరి పట్టు చేరుదను? దుర్నయమునకుఁ బాలుపడి యెట్లో కాలము పుచ్చుదమన నీదుగవస్థయేమి? ఈ బాలిక యేమి? పోయినభర్త రా నేరఁడు. వచ్చిన వైధవ్యము పోనేరదు. కానున్నది కాక పోదు. ఈబాలికకొక మగని గూర్చి యాతని సాహాయ్యమున జీవనము సేయుదునా? ఎవడు గ్రహించును? విధవాపుత్రికగదా! ఈబాలిక యెవ్వతెయన్న నే నేమి చెప్పుదును? కన్య ప్రాయమెంతయని యడుగుట సహజము. తండ్రి పోయి యెంతకాలమైనదని యడుగుటయు సహజము. భర్తృమరణకాలమును బుత్రికా జననకాలమును బోల్చి సరిచూచిరేని యపు డప్రతిష్ఠపాలుగానా? భర్తృమరణకాల విషయమై కొంత చెడదగానే! ద్వితీయ వివాహవిషయము తప్పించుకొను టెట్లు? నిజము తప్పదు. ఈ బాలిక కిప్పుడే వివాహము సేయుదునా? ఈ వయస్సునఁ బరిణయమాడి తల్లులమ్మగ ననుభవించుచున్న యీదురవస్థ నాబిడ్డకుఁగూడ కలుగవలయునా? అమ్మా కాదా! నీ ముద్దుమురిపెములు చూచి యానందించు భాగ్యము నాకు లేదుకదా! » అని పలుతెఱుల విచారించు నొక వితంతువును దదుత్సంగోపవిష్టయగు నొక బాలికను నొక భోగాంగనగాంచె. ఆమె దీనాలాపంబుల నించుక వినియుండుటచే భోగాంగన యామెపైఁ గరుణించి యిట్లు సంభాషింపఁ జొచ్చెను.

భో.—అమ్మా మీదే దేశము?

—ఇచటికి కనతిదూరమే!

—ఇచటికేల వచ్చితిరి? మీ తావును విడువ హేతువేమి?

—ఏమని చెప్పుదును? నేను బడిన పాట్లును నాకు ఘటిల్లిన యాపదలును నోరులతోఁ జెప్పఁగొనవలయునా? పొందిన యవమానము చాలదా?

భా.—అమ్మా! నిర్విచారముగాఁ జెప్పుము. నన్ను వేఱువిధముగా భావింపకుము.

వి.—నేనీ ప్రాంతమునఁ గీర్తివహించిన యొక సోమయాజిగారికుమార్తెను. కాలక్రమమును బట్టియు, నాచారధర్మములను బట్టియు దేశస్థితిని బట్టియు సోమయాజియగు మాతండ్రిగారు నా కైదవయేటనే వివాహముగావించిరి.

భా.—వివాహసమయమున నీభర్తయందు నీకేమైన ననురాగముండెడిదా!

వి.—వారెవరో నాకప్పుడేమియుఁ దెలియదు. నేనమ్మగారియండ మామకొని యా యన కొఱకుచేతి పైపునఁగూరుచుండెడిదానను.

భా.—పదపఁడి.

వి.—నన్నుఁ బరిపూర్ణ విద్యావంతుఁడగు నొక యవధానిగారికిచ్చి వివాహముచేసిరి.

భా.—అప్పటి కాయన ప్రాయమెంత!

వి.—నూటికిఁ బదేండ్లుతక్కువ ప్రాయముగారు!

భా.—తరువాత నీభర్త యెంతకాలము జీవించెను?

వి.—ఎంతకాలమెక్కడిది? ఆసంవత్సరముగడువలేదు.

భా.—రామరామ: ఎంతమాట! అట్లయిన నీబాలిక యెవ్వతె?

వి.—నాపుత్రిక.

భా.—ఎట్లు?

వి.—తగుప్రాయమువచ్చి జ్ఞానవతినైనంతనే మరల స్వయంవరము చేసికొంటిని. ద్వితీయధవునకే పుత్రిక జనియించినది

భా.—తరువాత?

వి.—నా ద్వితీయభర్తయుఁ గొలదికాలముక్రింద గతించె. అప్పుడు నేనేదైన నొక పుణ్యక్షేత్రమునుండి దైవభక్తిచేఁ గాలముగడుపవలయునను నుద్దేశము నొందితిని.

భా.—అట్లయిన నీబాలిక నేమిచేసెదవు?

వి.—అదియేనా విచారము. ఎవ్వరైనగావలెనని పెంచుకొనువారలు వారికిచ్చెదరు.

భో.—అట్లయిన నీయూరనొక వేశ్యాంగనగలదు దానిపేరు "కోకిల" దానికి సంతతిలేదు పిల్లలఁజూచినప్పుడు కడుంగడు ముచ్చటపడుచుండును. ఈబాలిక నావేశ్యకొసంగితివేని నీయభీష్టమునెరవేరును.

వి.—ఆమె యెవరట?

భో.—ఇచ్చటనే!

వి.—ఆమె నాకిపుడు చూపఁగలవా? ఆమె యెట్లుండును?

భో.—ఆమెను నీవిప్పుడు చూచుచునేయుంటివి. నావలెనేయుండును.

వి.—నీమాటలనుబట్టి నీవేయామెనట్లుతోఁచుచున్నది.

భో.—ఔనైన నాకొసంగెదవా?

వి.—ఓసి మిః? అనురాగమునఁ బెంచిపెద్దదానిని జేయవలెనుగాని యివ్వనైననేమి?

ఇట్లు భోగాంగన యావితంతువుతో మరికొంతప్రసంగించి శారదయను బాలికను భోగాంగనాపరిగ్రహించె. విధవాంతమువనన్న తనగేహమునకుంగొనిపోయి యానాఁడు మొదలుగ నత్యనురాగంబున బెంచుచుండె. వితంతువును నిజాభిలాష నెఱవేర్చుకొనుటకై యాత్రానిర్గమనాలోచనము చేయుచునరుగుచెంచెను.



# నాలుగవ ప్రకరణము.

## విచారణ.

భో—అయ్యా మీరెవరు?

వి— నేను విక్రమసింహపురవాసుఁడను.

భో—మీ యాగమన కారణమేమి? మీరేమి చదువుచుంటిరి?

వి— నేను గ్రొత్తగ ప్రవేశ పరీక్షలో నుత్తీర్ణుఁడనైతిని.

నాతండ్రి బాల్యమునందే గతించెను. అప్పటినుండి నాతల్లి నాయన్న కొలఁది జీతమునచే నన్నుఁబోషించి యింతవఱకుఁ జదువు చెప్పించెను. దైవసాహాయ్యమున ప్రవేశ పరీక్షలో నేను మొదటి తరగతిలో నుత్తీర్ణుఁడనయితిని. ఇఁక విశ్వ విద్యాలయమునం జేరవాంఛ మెండుగ నుండుటం జేసి తమ సహాయ్యము వేఁడవచ్చితిని. ఇదియే నావృత్తాంతము.

భో—ప్రవేశ పరీక్షావిజయముపొందితివేని మాకు మర్యాదలు తెలిసినట్లు కనుపడదే? కాలిజోడునుం దియకయే నాగదిలోనికి రావచ్చునా?

వి— అయ్యా పొరపాటు క్షమింపుఁడు అనుచు నావలికరిగి పాదరక్షల నచ్చట విడిచి తిరిగి ప్రవేశించెను.

భో—మంచిది. మీరే వర్ణస్థులు?

వి— అయ్యా! నేను బ్రాహ్మణుఁడను.

భో—బ్రాహ్మణుఁడవా? ఇట్టి బ్రాహ్మణులును గలరా?

వి— అయ్యా! అట్లనెదరేమి?

భో—(కోపముతో) ఓహో! నీకుఁ గారణములు తెలియవలెనా? ఇటువినుము నీవేషము, నీకోడితల, నీయునికి నీచర్య వీనింజూడఁ గేవలము క్రైస్తవుఁడవుగ నగపడుచున్నావు. కాని బ్రాహ్మణుఁడవుగఁ గనుపడుటలేదు. ఎప్పుడో నించుక యాంగ్లేయవిద్య నభ్యసించఁగనే గర్వాంధులై కులధర్మములమాని భ్రష్టపడుహీనుల మోములనేఁ జూడనోప.

నాయనా! యీవిషయమున నీవంతచింతింపఁబనిలేదు. నాకున్న యాస్తియంతయు నీదేగదా! యాస్తియంతయు నీవిద్యకై వినియోగించుకొనుము.

అమ్మా నీవెట్టివెఱ్ఱివి! మనయాస్తివిక్రయించిన నెంతకాలముండఁగలము? ఆపైన నీవెట్లు జీవించెదవు?

నాయనా! నేనెట్లయిన జీవించెదను. నీవు విద్యాసంపూర్ణుఁడ వగువరకు నెట్లయినఁగష్టించి—

ఎంతమాట! అమ్మా నీవు మాటికిఁగష్టపడుచుండఁ నేవిద్యనభ్యసింపవలెనా? అట్టివిద్య లేకున్న నేమి? ఇంతకాలము నాకొఱకై నీవుపడినయిడుమలు నేనెఱుఁగుదును. ఇఁక కూటికని కష్టపడవలెనా? చాలును ఇట్టికఠోరవాక్యములు నేను వినఁజాలను.

వీరియట్లు తల్లీకుమారులు దుఃఖాక్రాంతులై సంభాషించుచుండఁ దటాలున నింటిలోని కొకపురుషుఁడు ప్రవేశించెను.

---

# ఎనిమిదవ ప్రకరణము.

## బడిచెలిమి బలిమి.

సుందరుఁడు ప్రవేశపరీక్షావిజయమునకై ప్రయత్నించువేళ నతనికి మదనుఁడను నొక సహాధ్యాయి కలఁడు. చిన్ననాఁటనుండియు వీరిరువురు నొక్కటిగ విద్య నేర్చుకొనుచుండిరి. అందువలన వీరికిఁ బరస్పరానురాగము మెండై యుండెను. వీరిరువురు సమవయస్కులు. మదనుఁడు సింహపురీనగరమునకు ననతిదూరమున నున్న చిన్నరాయపురంబను జనపదంబున నుండు నొక గొప్ప భూస్వామి పుత్త్రుఁడు. ఇతని తండ్రి యితని నతిబాల్యమునందె విద్య నేర్పించుటకొఱకు సింహపురనగరమునకుఁ బంపెను. అప్పటినుండియు నితఁడును సుందరుఁడును నొకే విద్యాలయమునఁ జదువుచుండిరి. ప్రవేశపరీక్షయందు వీరిరువురు నొక సంవత్సరమున కృతార్థులైరి. పరీక్షకుఁ గొన్నిదినాలకు పూర్వమే యితని తండ్రి యాకస్మికముగఁ గాలధర్మము నొందెను. ఇతఁడు ప్రవేశపరీక్షయందుఁ గృతార్థుఁడైయుండియు దరిద్రవశమునఁ జదువ సహాయకారి లేమిం జేసి యతిదుఃఖమున విశ్వవిద్యాలయమునకుఁ బోవు ప్రయత్నము మానుకొనెను. సుందరుఁడును రాజ్యలక్ష్మియు సంభాషించుకొనువేళ వచ్చిన మనుజుఁడీమదనుఁడే. మిత్రుని జూచిన యప్పుడు సుందరుఁడు దీనవిషాదమును మ్రింగి నవ్వుచునిట్లు ప్రసంగించెను.

మదనా! రమ్ము కూర్చుండుము!

సుందరా! యేమియిది నీ మొగమంతయు వాఁడియున్నది! ఈవిషాదమునకుఁ గారణ మేమి?

ఎన్నిటికైనను లేమిడియే కారణము అహా! అహా దారిద్ర్యము శాపమే కదా!

ఈ విషయమయి భావభేదములున్నవి. నీకిపుడు కలిగిన కష్టమెయ్యది? అనఁ దండ్రి రాజ్యలక్ష్మియాదినమున జరిగినవృత్తాంతమంతయు మదనునకుఁ జెప్పెను. అతఁడదియెల్ల సావధానముగ విని మిత్రమా నీవీ విషయమున లేశమును జింతింపనక్కఱలేదు. నిన్ను నేను గుర్తెరింగినదాదిగ సహోదరభావముతోఁ జూచితిని గాని వేరొండుగాఁగాదు. రాజధానికిఁ బొమ్ము. విశ్వవిద్యాలయముఁ జేరుము. నీకయ్యెడి ధనవ్యయమంతయు నేను భరించెదను. ఇట్లు చెప్పి సుందరుని కౌఁగిలించికొనెను. అతఁడును తలవాల్చి కృతజ్ఞతాపూర్వకముగ నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

మిత్రమా! నీయౌదార్యమునకెంతయు నమస్కరించెదను. భూమ్యాకాశములును, సూర్యచంద్రులును, నా జననియును సాక్షిగ నేఁ జెప్పుచున్నాను. నా విద్యాభ్యాసకారణుఁడ వగుటచే నీవే తండ్రివి, నీవే తోడువు. ఏకాలమునకైనను నీవు నాకుఁ [illegible]

మేలునకు ప్రతిసేయుశక్తియు నవకాశమును గలుగఁజేయఁ గలందులకై భగవంతునిఁ బ్రార్థించెదము.

పిమ్మట రాజ్యలక్ష్మీసుందరులచే దీవనలంది మదనుఁడు నిజపురమునకుంజనెను. కొలఁదికాలమునకే సుందరుఁడు రాజధానికింజని విశ్వవిద్యాలయమునఁ బ్రవేశించెను.

## తొమ్మిదవ ప్రకరణము.
### దీనజనరక్షణము.

అయ్యో! అయ్యో! రక్షింపుడు. రక్షింపుడు.

ఛీ! మాలముండకొడుకా! వాదర్గరవా టక్కులు? నాఋణమిప్పుడు తీర్పుము లేనిచోఁ బనికిరమ్ము. అంతదనుక నేను నిన్ను విడువను.

మహాప్రభూ! నేను బానిసవాఁడను. నీచాకిరి చేయువాఁడను. దుస్థితి నొందున్న నన్ను శ్రమపెట్టిన నేను బ్రతుకను. నాయందుఁ గరుణయుంచి నన్ను మన్నింపుఁడు.

ఛీ! పశువా! గాడిద! [అని రెండుగ్రుద్దులు గ్రుద్దెను.]

అయ్యో చచ్చితి. అయ్యో! చచ్చితి?

అయ్యో మాయయ్యను గొట్టుచున్నారు. మాయయ్యను జంపుచున్నారు. బాబా చంపఁబోకుఁడు. ప్రాణముతో వదలుఁడు మీఋణము తీర్చుకొనియెదము. నాయనను వదలుఁడు. మీకాళ్ళు మ్రొక్కెదము. గంతెలుంగుచుఁ బ్రపగము నొదనధ్వనియు నొకగృహమునుండి వెలువడ నప్పుడొకయువకుఁడు హాయావరోహణము గావించి తటాలున నిలుచొచ్చెను. రక్తాక్షుఁడును దీర్ఘకాయుఁడును నగు నొకతరుణవయస్కుఁ డొకమాలని జుట్టుచేఁ బట్టిలాగుచుఁ గొట్టుచుండెను. ఆమాలఁడు క్రిందఁబడి వడఁకుచుండెను. అతఁడుతుదకు రెండుచేతులను జోడించి రక్షింపుడు, రక్షింపుడు, అని యార్తనాదమున నెలుఁగెత్తి యేడ్చుచుండెను. చెంతనున్న శిశువు తల్లిపయింబడి పెద్దగ నేడ్చెను. అప్పుడాయువజనుఁడత్యాగ్రహముచేఁ గోదండునికరమును గట్టిగఁబట్టి ఈక్షణమున నీమాలనివిడువుము: లేకున్న నీప్రాణములు నీవి గావనుకొనుము అనెను.

కోదండుఁడు:- ఓహో! మీరానన్ను దండించునది! అని హేళనసేయుచు నిట్లనెను.

ఓయీ! నీకిచటఁ బనిలేదు. ఈ మాలఁడు నాసేవకుఁడు. నావద్ద నప్పుపుచ్చుకొనినవాఁడు. కావున నేను దండించినను, ఖండించినను నీకు జోక్యము కలుగఁజేసికొన నవసరము లేదు.

దుర్మార్గా! నీకించుకయైనఁ గనికరము లేదా?. వ్యాధిగ్రస్తుఁడగు నీమాలవాని నకారణముగఁ జంపఁజూచితివే! ఈలోకమున లేకున్నను, పరమందైన నీయక్రమకార్యమునకుఁ బ్రతిదండన లేదా!

అవును. ఈ వేదాంతములనిఁక నిలుపుము. ఈ గ్రామమునందున్న హీనకులస్థులందరును బోధించుటకుఁ గారణము మీవు గదా! నీవు కులద్రోహివి. ఈ నీచుని కొఱకై నన్ను నిందించుచున్నావు. ఇందులకు ఫలము శీఘ్రముగ ననుభవించెదవు.

నీ గంభీరవాక్యములనిఁక నిలుపుము. అతఁడు నీకేమి యీయవలయునో చెప్పుము.

నాకతఁడొక నూఱురూప్యములీయవలయును.

మాలఁడు. అయ్యా అన్యాయము పలుకు. నేను మీయొద్ద దీసికొనినది యేబది రూప్యములే కదా? అందునకీ పదివర్షములనుండి నా వేతనమున సగభాగము ఋణమునకై యిచ్చుచుంటినే! ఇపుడు నూఱురూప్యము లెటులయినవి?

కో. నోరుమూయుము. నాతో వాదించెదవా? నీవు నావద్ద గైకొనినవి నూటయేబదిరూప్యములు. అందు నీపది వర్షములనుండి యేబదిరూప్యములు చెల్లుబడినవి. ఇంకను నూఱురూప్యములు నిల్వయున్నవి. కట్టివేఁగట్టుము. లేకున్న నీపై న్యాయస్థానమున వ్యాజ్యము వేసి వడ్డీ ఖర్చులతోటి రాఁబట్టుకొనియెదను.

ఇది యంతయు వినిన కోదండునితో వాదించిన నిష్ఫలమనియుఁ దాఁజెప్పినట్లు ఋణమునకై యొక్కరి కేని కూటసాక్షులనియమింపఁ గలడనియు నెంచి యేమనుటకును దా నా కౌముల కాతని పేరనొక పత్రము లిఖించియిచ్చి మాలనిఋణవిముక్తుంజేసి తనపరిచారకులలోఁ జేర్చుకొనెను.

---

రా. తరువాత రహస్యముగఁ జెప్పెదనంటిని

వే. నామనంబాగకున్నది. వినదాయేమి చెప్పుము?

రా. [రహస్యముగ] పునఃప్రతిఅయినది.

వే. హా! ఎంత వైపరీత్యము.

రా. వెలువరింపక శాంతించి జరిగినది రహస్యముగనుంచుము.

క. అమ్మ నాకిక వివాహముమీఁద బుద్ధిపోవుటలేదు. నీవు తొలుత నిశ్చయించి నాతో రహస్యముగఁ జెప్పినవరుని నాకు లభింపఁజేసితివేని సమ్మతమే కానిచో నాకు వివాహముచేయ నక్కరలేదు.

రా. అమ్మా! అట్లనెదవేమి? అతనియందు మీతండ్రికిఁగల యిష్టము నీకుఁ దెలియదా? అతనికన్న నెక్కుడు ధనవంతులును జదువరులును లేరా? తదితరులయందేరి నైనను గోరుకొనరాదా?

కమల ఈవాక్యముల నాలకించి విచారభావంబునఁ గన్నీరుఁగార్చుచు నిలువంబడెను.

వే. మనయూరనున్న విద్యాదీక్షితునికుమారుఁడు నృసింహరాయుని యందేమయిన సుగుణములున్నట్లు తోఁచునా?

రా. అవునవును. అతనికీర్తి జగద్విదితము. ఈవిషయమున నాకును సమ్మతమే. మనయభిప్రాయమిందేకీభవించినది. ఇఁక ననుమానింపకుఁడు.

వే. అట్లయిన నిఁక బంధుమిత్రులకాహ్వానము పంపెదను.

రా. అట్లేచేయుఁడు అదియె సత్కార్యము.

కమల. యీప్రసంగము విని యేమియు నెఱుఁగనిదానివలె నటించి సమ్మతించె నా యనునట్లు ప్రవర్తించి వారిర్వురాలనౌదాసీన్యము వహించెను. పాపము దీనదంపతులు కొమరితనునమ్మి వివాహప్రయత్నమున నుండిరి.

## పదునొకండవ ప్రకరణము.

### పంచాయతి.

విక్రమసింహపురమున కొంతిదూరమునందున్న చిన్నిరాయపురంబున నతిరమణీయమగు నొక్క దేవాలయముకలదు. విచిత్రములగు చిత్తరువులతోడ శోభిల్లు గోపురములతోడను, విశాలమంటపములతోడను, రజిత సువర్ణాద్యమూల్యలోహనిర్మితములగు వాహనములతోడను, మత్స్యములు మెక్కి తిరుగాడు ఒక కొలంది వాదుల విలాస కయ్యలో యజనొప్పు కలలవిసురున నటునిటునూగాడు వికచకమలకుముదపుష్పములచే శోభిల్లు కొలంకుతోడను, కోదండరామనిలయాలయము చెలువారుచుండు. ఆయాలయమునెదుట విశాలములగు చలువరాలచేఁ గూర్పబడిన యొకమంటపముగలదు. ఒకనాఁటి సాయంకాలమున నా దేవాలయమంటపమున సభకూడిరి. ఎల్లజాతులవారు నాసభనలంకరించిరి. వీరందరు నెద్దియో యొకవిషయమును గూర్చియిట్లుతర్కించుకొనుచుండిరి.

ప్ర. అయ్యా మనయూరి దేవతయగు పోలేరమ్మకు జాతరజరిగి రెండేండ్లయినది.

ద్వి. అవును. ఈసంవత్సరము జాతరజరుపకున్నచో నీయూరు ధ్వంసము గావించును. కావున జాతరజరిగి తీరవలయును.

తృ. అయ్యా! జాతరమహోత్సవము జరుపనెల్లరు నియ్యకొనవలెను గదా!

అవునవును. [అని అందఱునరచిరి.] అపుడా సభ్యులలో నొక యువజనుఁడు లేచి యిట్లు చెప్పఁదొడఁగెను.

సభ్యులారా! ఇచటఁ జేరినవారందఱికన్న జ్ఞానమునఁగాని, ధనమునఁగాని యొక్కువవాఁడను గాను. అయిన నా ప్రార్థనము లాలకింపవలయును. మీరొనరించు మహోత్సవము నేనేమియు నాక్షేపించువాఁడను గాను. మీరు తీరుమానించు భంగి చేయుము నావంతు కప్పము నర్పింతును. జాతరకాలమున జరుగుకొన్ని ఘోరకృత్యముల నాపవలెనని నాప్రార్థన. తత్కాలమున జరుగు జీవహింసఁదలంప నామనంబెంతయుఁ దల్లడిల్లుచున్నది. నిష్కారణముగ జంతుసంతానముల బహిరంగముగ వధించు మనము మృగమాత్రులముగాని మనుష్యమాత్రులముగాము. హింస మిక్కిలి పాపకరము. పుష్పములతోడను, ఫలములతోడను బూజించిన శాక్తి తృప్తిపడదా? నామొరాలకించి యీఘోరకృత్యము మాత్రమును మానివింపెదరుగాక అని ప్రార్థించుచున్నాఁడను.

# పండ్రెండవ ప్రకరణము.

## ప్రయత్నభంగము.

మంగళస్నానము లైనవా? వధూవరులఁ గైకొనిరండు.

మంగళాసనముల నమర్చితిరా? యూరిలోని పెద్దమనుష్యుల నాశీర్వచనమున కును దాంబూల గ్రహణమునకు నని యాహ్వానము సేసి వచ్చితిరా?

పెండ్లికొమారితె వారి యాహ్వానమైనది.

అలపింపఁబడు లగ్నసమయము వచ్చుచున్నది. వధువును ముందు గైకొనిరండు.

పదంపడి కొందఱు వధువుం గైకొని దాలోని కరిగిరి. వివిధములగు మధుర వాద్యములును, సంతోషసూచక వైవాహిక జనసల్లాపములును, ఉభయ పార్శ్వముల వింజామరల వీఁచు వేశ్యాంగనలును వెలుంగ కళ్యాణయూథుఁడై మహావైభవమునఁ బెండ్లి కొమరుఁడు మామగారి గృహమునఁబడిన యాకైలవ వివాహసదనమునుం జేరెను. వివాహసుముహూర్త మాసన్న మగుడుఁ బెండ్లిపెద్దలు దొందర సేయుచుండిరి. పెండ్లికొమరిత యింకను రాదయ్యె. ఆమెకొఱకై దాదులు గదులెల్ల వెదకిరి. ఎచ్చటను గాన్పింపదయ్యె. ఈవార్త వేణుగోపాలశర్మగారికిఁ జేర అతఁడత్యంత భయాక్రాంత స్వాంతుఁడై కొమరిత గదిలోనికిం జనియె. మఱల మఱలఁ దేరి పారఁ జూచుటయే గాని, యెవ్వరును గానరారైరి. తుదకామె పండిన సెజ్జపై నొకలేఖ గాన్పించెను. అద్దానిపై

నాయనగారగు వేణుగోపాల శర్మగారికి, అని వ్రాయఁబడియుండెను. అతి త్వరితముగ నాలేఖ నతఁడు విప్పిచదువఁ దొడంగెను.

జనకా! మీరు దలపెట్టిన యీవివాహము నాకసమ్మతము. పరిణయముగాక యున్న మీకీ మీయింటనుండుట మీకపఖ్యాతి. కావున మీగృహము విడనాడ నుద్యమించితి. నా స్నేహితురాండ్రగు కొందఱు క్రైస్తవ సోదరీమణుల సాహాయ్యమున రాజధానికింజని యచ్చటనున్న యనాథస్త్రీజన శరణాలయమున కరిగెదను. నన్ను మృతిజెందిన దానినిబోలె నరసెదరుగాక. నన్నుఁ దిరిగి కొనవలెనని యెట్టిప్రయత్నము సేయుచున్నవారని విన్నను నేనాత్మహత్య గావించుకొని యసువులం బాపుకొనెదను. నన్ను క్షమింతురుగాక. మీకును నాప్రియమైన తల్లిగారికిని నావందనములు.

ఇట్లు మీ యనుంగు కూతురు,

కమల.

ఆహా! యేమి వైపరీత్యము? కల్యాణ గృహమిప్పుడు నిర్యాణ గృహముగమారెను. స్త్రీయాబాలాదియుం దశ్శోకాబ్ధియందు నిశ్చేష్టులైవేఱొకపార్శ్వమునఁబడియుండిరి. పెండ్లికివచ్చిన బంధువులెల్ల చెల్లా చెదరై వెడలిరి. పెండ్లికొమరుం డగు నృసింహారాయఁడు కళ్యాణ మంటపమున కెంత సంతోషమున వచ్చెనో యంత సంతాపమున నచ్చటువాసెను.



# పదునాఱవ ప్రకరణము.

## వేశ్యాగృహము.

ఒకనాఁటి సాయంకాలమునఁ జిన్నరాయపురమునఁ గోదండరాముని యాలయమునకు నుత్తర దిశయందుండు వీధి యందిరువురు పురుషులు ప్రాఙ్ముఖులై నడచుచుండిరి. వీధియందు దేవాశ్రితులగు నర్తకులు మున్నగువారు కాపురముందురు. చీకటివేళ యైనందునను మొగంబులు తెలియరాకుండునటుల మేలిముసుంగులిడి యుండు కారణంబునను నాపురుషు లెవరైనదియు గుర్తింప నలవికాకుండెను. వారిరువురు నొండొరులేమియు సంభాషించుకొనక యత్యంత దూరము పోయి వీధ్యగ్రమున నొక యింటి వాకిట నిలువంబడిరి. ఆయింటి ద్వారము మూయఁబడియుండెను. చెంతను దెరచి యున్న గవాక్షమునుండి ప్రజ్వరిల్లు దీపపుగాంతి వెలువడుచుండెను. గృహాంతరమున నొకబాల మృదుమధుర స్వరాంచితముగ గానపేటికను వాయించుచు పదంబుఁ బాడుచుండెను. వారిరువురిలో నొకఁడు ద్వారప్రాంతమునకేగి తలుపుదట్టుచుఁ „కోకిలా! కోకిలా!'' అని మెల్లగఁ బిలచెను. లోనున్న యొకయువిద "ఇదిగో వచ్చితిని" అని చెప్పుచు నతిత్వరితముగ ద్వారముం దెఱచెను. వీరిరువురును లోనికిం జనిరి. ద్వారము మఱల మూయఁబడెను. ముంగిలి కూట మతిరమణీయముగ వివిధ శృంగార రసానుబోధకమ్ములగు పటములచే నలంకరింపఁబడియెను. నిర్మలములగు పరిధానముల ధరించి, వివిధాభరణ భూషితయై మందస్మితాననయై కవాటము దెఱచిన యాయువతి ప్రౌఢాంగనగాఁ గనఁబడెను. గాన పరాయత్తచిత్తయగు నాబాలిక పీతాంబర ధారిణియై నవరత్న ఖచితములగు నాభరణము లనేకముల ధరించియుండెను. పూర్ణేందు బింబంబును బోలిన యాబాలిక ముఖంబును గమనించుచుండ నెట్టివారి యొక్క మనోవ్యాకులత యామెయెడ నగపడునుగాని యది సాధారణముగఁ గాన్పింపరాదు.

అయ్యలారా! కూర్చుండుఁడు. అని కోకిల స్వాగతముసంగ నాయిరువురు పురుషులు నున్నతాసనములఁ గూర్చుండి మేలిముసుంగులఁ దీసివైచిరి. వీరిలో నొకఁ డించుమించు ముప్పది ముప్పదియైదు సంవత్సరముల ప్రాయమువాఁడు. ఇతఁడు బ్రాహ్మణవంశ సంజాతుఁడుగ నగపడువాఁడు. అతఁడాయింటి వేశ్యయగు కోకిల విటకాఁడు. బాణుండనువాఁడు. మఱియొకఁడు మదనికి విరోధియగు కోదండుఁ డీపురుషులిరువురును గృహమునఁ బ్రవేశించినది మొదలుకొని సరసవాక్య ప్రసంగము చేయసాగిరి. ఆయిర్వురి సంభాషణ మించుక నాహాసేయనయ్యెడని అపుడు నాయింటనున్న బాలిక విద్యానైపుణ్య మాపాదించి భరతాది కళావిశేషములయందు బ్రౌఢిమ గడించెనని కోకిల యుడివెను. అప్పుడు బాణుడు కోకిలం బిలచి యేదో రహస్యముగఁ జెవిలోఁ జెప్పెను. అంతట కోకిల „ఏమే శారదా లోపల దాఁగు

# పదునెనిమిదవ ప్రకరణము.

## జాతర.

ఓరీ! చిన్నరాయని పురమందలి యీ గందరగోళమేమి? గ్రామమధ్యమున నీ జనసంఘమేమి? యూరి నట్టనడుమ నీచిన్ని యాలయమేమి? అందులోనున్న యీ విగ్రహమేమి? నేటికీ పురమంతయు నిట్లుగా నలంకరింపఁబడినది. జనసమూహముచే సందులు నిండియున్నవి. అచ్చటచ్చట కొందరు స్త్రీ పురుషులు రాటములపై దిరుగుచున్నారు. కొందరు వివిధములగు వేషములు ధరించి నృత్యములు సాయించుచున్నారు. కొందరు పీటికె యందలి చిత్రగువ్వులఁ జూచుచు నానందించుచున్నారు. కొందరందందు చెప్పఁబడు జంగాల కథలను వినుచున్నారు. సూర్యాస్తమయ సమయమున నూరగ్రుమ్మరి గృహమునుండి గొనిదెచ్చుచున్నారు. తప్పెటలు డంకాలు మున్నగు వాద్యవిశేషములు మిన్నంట మ్రోయుచున్నవి. దిక్కెల్లఁ బిక్కటిల్లుచున్నవి. ఆమ్రోతలకు దేవతావిగ్రహముఁ గ్రోల చండాల స్త్రీ పురుషులు గొందరు భీకరారావములఁ జేయుచు నృత్యములు సేయుచున్నారు. ఆయూరఁ గాఁపులు మున్నగు వారందరు దీర్ఘదండములబూని జనముల వెనుద్రోయుచున్నారు. స్త్రీ పురుషుల నేకులు తమమ్రొక్కుఁబడిఁదీర్చుకొను నుద్దేశమున తలలపై దీపముల నిడుకొని దేవతలం దర్శించుచున్నారు. కొందరు దేవతలయెదుట నన్నరాములఁబోసి గొర్రెలను మేకలను గోళ్ళను బలియిచ్చుచున్నారు. అట్టిసమయమున జెంటఁదేఁబడు దివిటీలఁ గాంతిచే నాదేవత మొగం బతిరౌద్రాకారమునఁ గనఁబడుచున్నది. దేవతాలయమున కరుగుచున్నది. శ్యామ సేయుడని కొంద రనుచున్నారు. యేమి హేతువని విచారించుచు నొక్కబ్రాహ్మణుడు మిన్నక యాలోచన చేయుచున్నవాడు. కొంత తడవీయాలోచనచేసిచేసి తుదకతండు ప్రవిడి యోగిను దేవతాలయములోనికి గొనిపోవక మున్నే యూరపోతను నొకమహిషమును బలియిచ్చు నాచారముగలదు. ఆమహిషము నాదినమున గ్రామమంతయుఁ ద్రిప్పి యచ్చోటికిఁ దెచ్చియుండిరి. ఆపోతును దొంగవాడెవడోయూరి వెట్టివానిని దేవత యచ్చోట నిలువఁగనే వెట్టివానిని వెదకిరి. సమయమునకు వాఁడు రాఁడాయెను. తొలుత నీయాడంబరముఁజూచి యోగిని పురుషుఁడేమయిన వాటంకము పన్నెనేమొగాని యాయూర నెచట వెదకినను వెట్టివాఁడుగాని వానిబందుగుఁడు మఱియొకఁడుగాని కానరాఁడయ్యె. అతనిపై నందరకును ననుమానము జనించె. ఆయూరి జాపజనంబంతయు నాలోచనపరులై తొలుత జీవహింస వలదని పాలించి యోగినివాఁడే తిరిగి యీజాతరసన్నాహముఁ జూచియోగివాఁడనియు నతఁడే యీద్రోహము చేసినవాఁడనియుఁ దీర్మానించుకొని యాతనిపైఁగసిదీర్చుకొన నూహించుచుండిరి. అచ్చటనున్నవారిలో నొకయువతి వీరావేశంబునఁబోఁగమ్మను తెలోలరమ్మను నాపోతును వాకిట్యాక నన్నవమానించుచున్నారు. మిమ్ముల ధ్వంసముజేసెదన్ అనిరక్తాక్షియైయుంభీకరారావమున నఱచెను. అప్పుడాయూరి గాఁపులలో కొందఱు వృద్ధులాయువతికి సాంబ్రాణిధూపములును కర్పూరహారతియునిడి కేల్మో

లేదు. తండ్రీ! నన్నుఁగాపాడెంచి మీగ్రామవైరము మానుము. శీఘ్రముగఁ జరిగిన మాడి వంశముద్ధరింపుము.

అమ్మా! 'నిశ్చయము దెలియని బాలికవలె మాటాడెదవేమి! విరహరాధికకు నన్ను వారెట్టి యిడుములం బెట్టిరి? ఎన్ని వ్యవహారముల నన్ను నిర్బంధించిరి? దైవసాహాయ్యము లేకయున్న నాగతి యేమైయుండును? వారివారి దుష్కార్యములకు వారే ప్రతిఫలము ననుభవింపక తీరునా! నేను దైవమును నమ్మినవాఁడను. ఎన్ని యిడుములం గలిగినను, నెన్ని యిక్కట్టులు రానున్నను, ధర్మమార్గము విడచి యధర్ములను, నజ్ఞానులను నగు కూళలు నడచుమార్గము ద్రొక్కనోప. మతి చెడుచున్నప్పటి స్థితిని బట్టి వివాహము నా మనము పొందకున్నది. ఇఁకఁ గొన్ని నాళ్ళు జరుగనిమ్ము. పదంపడి నీయిష్టానుసారము జరుగఁగలదు.

రా—అవునురా మాబ్రాహ్మణార్థపువాండ్రు భిక్ష చేయించిన వింతయే. నిన్నటిదినము వేణుగోపాల శర్మగారియింటిలో నెంత తృప్తికరముగా నున్నదిరా? వడలలో మునిగి నేతిలోఁ దేలితిమిగదరా!

గో—అవును. ఒక్కొక్క లడ్డుండ నారికేళ ఫలప్రమాణమురా!

రా—పాయసమెంత దివ్యముగా నుండెనదిరా!

గో—రామకృష్ణా! ఎచ్చటను చెప్పకుము. నేను బదునైదు పంచపాత్రల పాయసము త్రాగితిని. ముఖల శర్మగారి యింటిలో భిక్ష లేదటరా?

రా—ఓరి! వెధవా! నీవు పట్టివెఱ్ఱివే? లేవు శర్మగారి భిక్షయైనసంగతి నీకుఁ దెలియదఁటరా?

గో—లేపేనఁటరా? ఇప్పటికే నాకజీర్ణరోగము మెండుగ నున్నయటులున్నదే? లేపేమి తినఁగలనురా?

రా—నీవు నపుంసకుఁడవు. ఇటువంటి భిక్షలు నా కయినను నేను పరకు సేయను.

గో—నీవు మొనగాఁడవేగాని శర్మగారింక నెందరా యిన్ని భిక్షల నిచ్చుచున్నారు? ఇప్పటికే వారైదు భిక్షల నిచ్చిరి. ఇంక నైదుభిక్షల నిడెదరఁట.

రామ—ఎందుకా? దేశాంతరము చనిన యాయన కుమారుని కులములో చేర్చుకొనుటకు లేనియెడల శర్మగారా యిటుల సెలవు సేయునది?

గో—అట్లయిన శర్మ కుమారుని స్వాములవారు సంఘములోఁ జేర్చుకొన్నారఁటరా?

రా—ఇంకను విష్ణుశర్మ రాలేదు గదరా? వారేమో రాఁబోవుదురట వచ్చిన వెనుకగదా యది తీర్మానమగునట.

గో—ఎందుకుఁ జేర్చుకొనఁగూడదు?

రా—ఎందుకా? మందుకు. నీకెందుకురా! యీ యధిక ప్రసంగము?

గో—శర్మగారి కూఁతురు కమలయిచట నున్నదిరా?

రాము—ఏటిలో అదృష్టవిచారము నీకేలరా? ఇఁకఁ బ్రొద్దయినది. పోవుదము రెమ్ము. అజీర్ణ హారమునకు నాయొద్దఁ గొన్ని ఘుటికలున్నవి. మాయింటికి రమ్ము నీకొక మాత్ర నిచ్చెదను. దానిని మ్రింగినం రేపటిభిక్షకు సిద్ధముగ నుండఁగలవు.

ఇట్లు సంభాషించుచు నాతిండిపోతు లిరువురు నాపంచవిడిచి చనిరి.

———(౦)———

# ఇరువదిమూఁడవ ప్రకరణము.

## మంత్రము.

హిందూమత సంరక్షకుండును, వేదవేదాంతోద్ధారకుండును, జగద్గురుండును నగు శ్రీశంకరుని పీఠముల నేకము లీదేశమునం గలవు. అందు వేదగిరిపీఠము సింహాపురమున కనతిదూరమున నున్నది. ఈప్రాక్కాలమున నీతివిద్యావిశారదుండును, నస్ఖలిత బ్రహ్మచారియు, సదాసన్న్యాసప్రశస్తుండును, దానశక్తుండును, నగు నొకమహనీయుండా పీఠము నలంకరించుచుండెను. వేణుగోపాలశర్మగారి ప్రేరితమున సింహపురవాసు లాయాచార్యులవారి నామంత్రణమునంపి సపరివారముగ వారు సింహపురికేతెంచిరి. సింహపురివాసులా మహనీయు నెంతయు గౌరవమున నాదరించిరి. బ్రాహ్మణులును శూద్రులును, వైశ్యులును ననేకభిక్షల నొసంగుచుండిరి. కొందఱియుల లను ధనికులుకాకున్నను పేరులోకరికన్న నొకరెక్కుడు డాంబికమున భిక్షలనీయందొడంగిరి. అనేకులు పాదపూజకై యాస్వాములవారిని దమగృహములకుం గొంపోయి యనేకవిధములం బూజించి కట్నములనొసంగుచుండిరి.

విప్రకుమారుల సంభాషణ జరిగిన మఱుసటిదినమున వేణుగోపాలశర్మగారి యింట నాఁటిభిక్ష జరుగనాయెను. సూర్యోదయమునంతనె భటులశ్వములను గజములను నొంటెలను నెక్కి శంఖాలవాయింపం బలువిధములగు వాద్యవిశేషములు దిక్కులం బిక్కటిల్లం వేదపారాయణముసేయు బ్రాహ్మణులు వెంటంజనుదేర స్వాములవారు నవరత్నఖచితములగు కిరీటములను, భుజకీర్తులను, మనోజ్ఞములగు హారములను, పీతాంబరములను ధరించి యతిరమణీయముగ నలంకరింపఁబడిన పల్లకియందు సుఖాసీనులై స్వాములవారత్యంత వైభవమున శర్మగారియింటికిం జనెను.

దారి యందంతటను జనులుగుంపులుగూడి స్వామిముఖసందర్శనము గావించుచు కృతార్థులగుచుండిరి. శర్మగారి సదనముం జేరినంతనె వారతి వినయమున నెదురుగ నేతెంచి స్వాములవారి పాదములంగడిగి తత్పాదస్పర్శమునం బవిత్రీకృతములయిన జలములం దన తలపైం జల్లుకొని, యతిభక్తియుతముగ నయ్యాచార్యు నుచితాసనాసీనుం గావించిరి. శర్మగారి బంధుమిత్రవర్గము లెల్ల నచ్చోటికి విచ్చేసి స్వామివారిం బూజించి కృతార్థులైరి. నాఁటిమధ్యాహ్నకాలమున జరిగిన భిక్షావైభవమును వర్ణింప నెట్టివారికిని నలవిగాదు. శర్మగారు ప్రయాసమునకును సెలవునకును వెనుదీయక భిక్షం జరపించిరి.

భోజనానంతరమున నతిథులెల్లరును సంతృప్తులై నిజనివాసములకేగిన పిమ్మట మూఁడుగంటలమున స్వామివారు సభదీర్చిరి. ఆసభయందనేకులు పండితాగ్రేసరులగు విప్రోత్తములుచేరి శాస్త్రపర్యాలోచనము సేయందొడంగిరి. ఆసమయమున వేణుగోపా

లశర్మగారును, మఱియొక పురుషుఁడును కొంతనున్న మఱియొకగదియందాసీనులై యుండిరి. ఆపురుషుఁడు రత్నఖచితములగు మణికంకణములును, కుండలములును ధరించి విలువగల జరీవస్త్రములచే నలంకృతుండైయుండెను. అతఁడు ప్రాయము చెల్లిన వాఁడుగనుండెను. వారిరువురును తాంబూలములు చర్వించిన వెనుక శర్మగారాపురుషునిగని చిఱునగవుతోనిట్లనెను. దివాకరుగారూ! కార్యార్థినై మిమ్ములనాశ్రయించినవాఁడను ఎటులనయిన నాకభయవాక్యమిత్తురని ప్రార్థించెదను.

దివాక. ఈవిషయమున మీరంతగఁ బ్రార్థింపనక్కఱలేదు. అవకాశమున్నంతవఱకు మీకుసాహాయ్యముసేయ సిద్ధముగనున్నవాఁడను. మీకోరికల సెలవిండు.

వేణు. ప్రథమమున దేశాంతరస్థుఁడగు నాకుమారునిఁ గులమునఁ జాతిఁ జేర్చి సన్మానింతురని ప్రార్థించెదను.

దివాక. అతఁడిపుడెచ్చట నున్నవాఁడు?

వేణు. ఆంగ్లేయదేశమున వైద్యవిద్యను బరిపూర్ణముగ గ్రహించి గొప్పరాజకీయోద్యోగమును సంపాదించి మనదేశమునకు రానున్నవాఁడు. కతిపయ దినములకాతఁడిచ్చో నుండఁగలఁడు.

దివాక. ఇదిమిక్కిలి కష్టమటమే?

వేణు. తమదయ.

దివాక. [కొంతతడవాలోచించి] రాజకార్యార్థమై యన్యదేశములకుఁ జనువారికి మన్నింపఁగలము. ఆయాధారమున మీకుమారునికొఱకు నావలననైన శ్రమపడెదను. అయిన నీవిషయమున స్వాములవారి చిత్తమెటులుండునో!

వేణు. మీరు మనసారఁజేయఁదలచిన నిదియొకపనిగాదు.

దివాక. తమరెండవ యభీష్టమెద్ది?

వేణు. నావిరోధియు, మత్సంసారభంగమునకుఁ గారణభూతుండును నగు సుందరుఁ గులభ్రష్టుం గావించుటయే నా రెండవయభీష్టము.

దివాక. మత వైరుధ్యంబుగ నతఁడొనరించిన యకార్యమెయ్యది?

వేణు. ముగ్ధయగు వారూతుం బరిగ్రహించుటయే!

దివాన్. అందుకు సాక్ష్యము?

వేణు. ఇదిగో! వారిపుర రాజధానియం దేకాంతస్థలములయందు విరమించుచుండఁ జూచినవా స్నేహితులు వ్రాకింపిన లేఖనము లివి. అని యారాజాబుల దివాన్‌గారి చేతికందిచ్చెను. దివాన్‌జీగారా రాజాబులఁ జదువుకొని కొంతతడవాలోచించి ఇయ్యది సందేహాస్పదమే; కర్తవ్యము విచారించెద. వని యాలేఖనములఁ గైలంబూని యాగదివీడి యరిగెను. వేణుగోపాలశర్మయుఁ గొంత తడవాఁగి స్వాములవారి సభఁ జేరెను.

సాయంకాలమగునంత స్వాములవారతివిభవమున శర్మగారిగృహమువిడిచి తన విడిదిగృహమునకుఁ బోయెను.



## ఇరువదినాల్గవ ప్రకరణము.

## ద్వేషము.

ఇట్లుండ నత్యంత విభవమున స్వాములవారు సింహపురియందున్న సమయమున సుందరుని తల్లియగు రాజ్యలక్ష్మికి దేహమస్వస్థమై మిక్కిలి బాధగలిగెను. ఈసమాచారము మదనునకుఁ దెలియ వాఁడు సింహపురికిం జని యామెకెన్నియో యౌషధములు నిప్పించెనుగాని యామెకు వ్యాధి ప్రబలమయి ప్రాణము దక్కుటయే యనుమానముగనుండెను. అట్టిసమయమున నామె తనకుమారుఁ జూడ నిచ్ఛ యెఱింగింప మదనుఁడు సుందరునకుఁ దంతివార్త నంపెను. తల్లికిఁ గలిగిన యాపదకు సుందరుఁ డెంతయుఁ జింతిల్లి యేకాకిగ సింహపురమునకుఁ జేరెను.

తల్లి కుమారుఁ జూచి శోకాక్రాంతయై కన్నీరుగార్చుచుఁ గుమారుని దగ్గరకుఁ బిలచి ముద్దాడి యిట్లనెను

"నాయనా! నీకు వివాహము గాఁకమున్నె నిన్నొంటరిగా విడిచి చనటకై యెంతయుఁ జింతిల్లుచున్నదానను. అటుపయి సర్వమును భగవదనుగ్రహానుసారమే జరుఁగఁగలదు. శీఘ్రముగ వివాహమాడుము. నీశత్రువర్గముల విషమప్రయత్నములు నిన్నేమియు బాధింపనోపవు. సర్వకాల సర్వావస్థలయందును భగవంతుఁడు నిన్నుఁ గాపాడుఁగాక." అని దీవించి తనతలక్రింది దిండును జూపించి "నాయనా! నామరణానంతర మీదిండును విప్పిచూడుము. అందుఁ గొంత ధనముండఁగలదు. అంత్యకాలమున నీతల్లి నీకొసంగెడు కానుక యదియే." అని చెప్పెను. మఱియు మదనుని హస్తమున సుందరుని కరంబునిచ్చి "మీయిరువురి మైత్రి శాశ్వతమై జగత్ప్రసిద్ధమై వర్ధిల్లుఁగాక." అని యామె వారి నాశీర్వదించుచు నసువులవిడిచెను. మదనుఁడును సుందరుఁడును నొకవైపున నేలపైఁ బ్రాలి రాజ్యలక్ష్మి యాత్మ రక్షించుటకు భగవంతునిఁ బ్రార్థించిరి. శవమును స్మశానవాటికకు మోసికొనఁబోవ బ్రాహ్మణు లెవ్వరును నియ్యకొనరైరి. కారణమరయ సుందరుఁడు స్వాములవారి యానతిప్రకార మాంక్ష యందున్నటుల తెలియవచ్చెను. సుందరుఁ డిద్దాని వినినంతనె దిగ్భ్రమనొంది యేమియుఁ దోఁచక నిలువంబడెను. అంత మదనుఁడు మిక్కుటముగ ధనమిచ్చి బ్రాహ్మణులఁ గొందఱ నొప్పించి రాజ్యలక్ష్మికి దహన సంస్కారము లొనరింపఁజేసెను. మదనుని సాహాయ్యమున సుందరుఁడు దల్లికిఁ గర్మక్రతువుల నెల్లఁ గావించెను. కర్మజరిగిన మఱునాఁడు స్వామివారి యాస్థానమునుండి సుందరునకు, నాతని తల్లియొక్క కర్మక్రియలయందుఁ దోడ్పడినవారలకును దక్షిణస్వాములవారిని దర్శించుటకై యుత్తరువు లంపఁబడెను. సుందరునకుఁ దోడ్పడిన విప్రులందఱు నాలస్యముసేయక స్వామివారిని క్షమాపణను వేఁడి వారివలనఁ దీర్థములఁ బుచ్చుకొని మన్ననవడసిరి. సుందరుఁడిది యంతయు వేణుగోపాల శర్మగారి కృత్రిమమున జరిగినదని యెఱిఁగి స్వాములవారిని సందర్శింపఁడయ్యె. తమ యాజ్ఞానుసారముగ సుందరుఁడు దమ్ము సందర్శింపనందులకు స్వాములవారు సుందరుని యాంక్షను ఖాయపఱచెను.

ఇరువదియైదవ ప్రకరణము.—

# ఇరువదియైదవ ప్రకరణము.

## ఉపన్యాసము.

సుందరుని విద్యోన్నతికిని, పదవికి రాజధానియందుఁ గలిగిన గౌరవమునకును, సింహపురివాసులెంతయు సంతసించిరి. అతఁడు జనని యాపన్నావకాలమున సింహపురిని జేరినంతనె యాతని మిత్రులు తన సంఘసంస్కార విషయమై యుపన్యసింపవలసినదని యెంతయు వేఁడ నద్దానికి నొప్పుకొనెను. ఒకనాఁటి సాయంకాలమున సుందరుఁడుపన్యాసము నిచ్చునని నగరమునఁ బ్రచురింపబడెను. ఆయుపన్యాసమును వినుటకై సింహపురమందలి స్త్రీపురుషుల నేకులు నగరభవనమునం గూడిరి. విద్వాంసులును, న్యాయవాదులును, వర్తకులును, భూస్వాములును, విద్యార్థులును సభనలంకరించిరి. వేణుగోపాలశర్మగారును స్వాములవారి దివాన్ జీగారును వచ్చియుండిరి. సుందరుఁడున్నతస్థానమున నిలుచుండి సభాసదులనెల్లరఁ దిలకించి హిందూసంఘమందుఁ గాన్పించుననేక లోపములఁ జర్చించుచు నాలోపముల బరిమార్చిన జ్ఞానులయొక్క యత్నములకును, దీనజనరక్షణమునకును, స్త్రీపురుషులందఱు బాధ్యులఁ గావలయునని యెంతయు నొక్కి చెప్పుచుఁ దుదకిట్టులనెను.

సభాసదులారా! మన దేశమునందు జాతిభేదములవలనను, మతభేదములవలనను, మన సోదరులయందు మైత్రి లేమిం జేసి మనమిపుడన్ని విషయములయందును దీనస్థితియందున్నారము. ఇట్టి భేదములఁ బాపు నుపాయముల మనమందఱము గనవలసియున్నారము. మతాధిపతులైనను, మతాభిమానులైనను, నిట్టి భేదములమాపుటకై కృషిచేయువారు దేశాభిమానులు అటులఁ జేయక లేనిపోని భేదములఁ గల్పించుకొని స్వార్థములైన యాంక్షలచే జ్ఞానులనవమానించి కష్టపెట్టుచుండెడు పాపుల నీప్రపంచమున నెట్టియున్నతపదవియందున్నను దేశవైరులుగా నెన్నఁదగినవారుగాని దేశాభిమానులు గారు. ఆదియందీమతములు వేదవేదాంతోద్ధరణమునకై స్థాపింపఁబడినవి. ఈవిషయమునందొకింతయుఁ జర్చింపక యెపుడు భిక్షలతోడను, ఆంక్షలతోడను, గాలవ్యాపనము సేయువారల యాధీనులమై యుండ నవశ్యము లేదు. అట్టివారింబూజింప నేమియు ఫలంబు లేదు. అని యనేకభంగుల సంఘసంస్కరణార్థ విషయములఁ గూర్చియు జనసేవం గూర్చియుఁ జర్చించెను. ఈయుపన్యాసము వినినతోడనే సభ్యులనేకులు సుందరుని శ్లాఘింపఁదొడంగిరి. సుందరుఁడు దూషణ భూషణలను సరకుగొనక పలుతావుల నీవిషయములంగూర్చి యుపన్యసింపఁదొడఁగెను. స్వాములవారు సింహపురమునకు విచ్చేసి విశేషకాలమయినందునను చిన్నరాయని పురవాసులాహ్వానము పంపినందునను సింహపురింబాసి వైళంబ చిన్నరాయని పురముంజేరిరి.

---

## ఇరువదియాఱవ ప్రకరణము.

## దురాలోచన.

పిమ్మట నొకనాఁటి సాయంకాలసమయమున వేణుగోపాల శర్మగారియింట నేవురు పురుషులుచేరి యాలోచన చేయుచుండిరి. అందున్నవారిలో వేణుగోపాల శర్మగారిని మనకిదివఱకే తెలియును. తక్కిన నలువురిలో నిరువురు బ్రాహ్మణులు నిరువురు శూద్రులుగానుండిరి. ఈనలువురు చిన్నరాయని పురవాసులు. వీరేవురును దీర్ఘకాల మిద్దేనింగూర్చియో యతిరహస్యముగ నాలోచించుచుండిరి. వారిమొగములఁజూడ వారేదియో యొక ప్రమాదకరమగు విషయమునుగూర్చి యాలోచించుచున్నట్టులఁ దెలియవచ్చును. అంతఁ గొంతకాలమునకు వేణుగోపాల శర్మగారచటనున్న బ్రాహ్మణులలో నొక్కనిం దిలకించి యిట్లనెను.

ఇంకను నుపన్యాసములు జరుగుచున్నవా?

బ్రా—జరుగుచున్నవి. ఎక్కడఁజూచినను జాతిభ్రష్టత్వము గావలెననియుఁ, గులాచారములు నేలఁ గలుపవలెననియు, స్వాములవారి యాజ్ఞలఁ దిరస్కరింపవలెననియు నుపన్యాసములు జరుగుచున్నవి. మాయూరనే యిప్పటికి నాలుగైనవి. ప్రక్క గ్రామములయందుఁగూడ సుందర మదను లుపన్యాసము లిచ్చునట్టుల నేర్పాటు చేసికొనియున్నవారు. నాపుడు నచటనున్న యిరువురు గాఁపులలో నొకఁ డిట్టులనియెను.

అయ్యా! దీనికంతయుఁ గారణభూతుఁడు మదనుఁడే. వానివలన మా గ్రామము పాడగునట్టులనున్నది.

వే—కాదు కాదు. మదనునిఁ జెడఁజేసినది సుందరుఁడే. ఆదుర్మార్గుని బరిమార్చిన నంతయు సరియగును.

బ్రా—వీరిరువురిలో నెవరున్నను బ్రపంచమునకు హానియే!

వే—అట్టులయిన మీయిష్టవచ్చినటులఁ గావింపుఁడు.

బ్రా—మీసాహాయ్యము పరిపూర్ణముగ నుండఁగోరెదము.

వేణు.—అభ్యంతరము లేదు.

అంత నానలువురు పురుషులును వేణుగోపాల శర్మగారి సదనము వెలువడిరి.

శర్మగారేమియుఁ దోఁచనివానివలె నిటునటుఁ గొంత తడవు బాలిక తిరిగి, యాగదియందున్న యొక పేటికం దెఱచి, యద్దానిలోనుండి యొక లేఖనముం దీసి చదువ నారంభించెను. అది ముగిసినపిమ్మట, మఱల నాలేఖను పేటికయందిడి తనలోఁ దానిట్లనుకొనఁ దొడంగెను.

ఓహో! యిది మనకనుకూలమే. రేపుగదా విష్ణుశర్మ రాజధానిం జేరునది. నే నీదినమే రాజధానికేగెదను. ఈ ఘోరకృత్యము జరుగునపుడు నేనిచట నుండఁదగదు. ఏమంటివి? ఘోరకృత్యమనియా? కాదు. మున్ను మతాచార విరోధులగు దుర్మార్గులఁ బెకలార్చుటకై శ్రీమన్నారాయణుఁడీ ప్రపంచమున నవతరించలేదా? మందరా! నీవా! నన్నుఁ దిరస్కరించువాఁడవు? నీ ప్రాణములను నీవు గాపాడుకొనుము. అని యతిత్వరితముగ రాజధానికిఁ బయనమై యిలువెడలెను.

---

# ఇరువదియేడవప్రకరణము.

## ఘోరకృత్యములు.

మఱునాఁడు సాయంకాలసమయమున రాజధానియందు బంధుమిత్రసమేతుఁడై వేణుగోపాలశర్మ కుమారుని సందర్శించు కుతూహలమున ధూమశకటనిలయమునకేగెను. ఆనాఁటిబండియందు విష్ణుశర్మ రాఁడాయెను. కాని మఱునాఁడే తెంచుమనుజుల విష్ణుశర్మయొద్దనుండి తంతివర్తమానము రాఁబడెను. మఱునాఁడు మఱల వేణుగోపాలశర్మ ధూమశకట నిలయమునకుఁజని కుమారునికొఱకైఁ వేచియుండెను. బొంబాయినగరమునుండి ధూమశకటమేతేఱ వేణుగోపాలశర్మ యాశకటమంతయుఁ గుమారునకై వెదకిన నతఁడు గాన్పించనందున నాఁటికిని విష్ణుశర్మ రాలేదని యనకొని దీనవదనమున నొకచెంతనిలువబడెను. అప్పుడొక యువజనుఁ డాంగ్లేయుల యుడుపులధరించి కడు రాజసమున వేణుగోపాల శర్మగారి కడకేతెంచి నమస్కారపూర్వకముగ తండ్రీ! నన్ను గుర్తింపలేదా? అని యడిగెను. అపుడు వేణుగోపాలశర్మ కుమారుని గుర్తించి మిగులఁ దమకమున నాతనిఁ గౌఁగిలించి ముద్దాడెను. కొంతతడవు తండ్రితో ముచ్చటించి తనమిత్రులగు కొందఱాంగ్లేయులతో రాజధానియందున్న యొక యాంగ్లేయ భోజనశాలయందుఁ దామఁట నివసించుచున్నటులను, మఱునాఁటి యుదయమున దండ్రిగారి తావునకు రాఁగలనటుల వేణుగోపాలశర్మగారి కెఱింగించి విష్ణుశర్మ యచ్చోటు వాసెను.

కుమారుని జాతిభ్రష్టత్వమున కెంతయుఁ జింతిల్లుచు వేణుగోపాలశర్మ నిజమందిరమును జేరెను. మఱునాఁటి యుదయమున స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ దీర్చి కుమారుని యాస్థానమునకేగెను. కుమారుఁడెచటికో యాకస్మికముగ నేగినట్లు తెలియఁగ నాతనికొఱకు గొంతతడవు వేఁచియుండ నతఁడతి రౌద్రాకారమున నిలుసేరెను. కుమారుని వెంటనే తండ్రియు లోనికిఁజని యాతనిచెంతఁ గూర్చుండి నాయనా! సంతాపమునకుఁ గారణమేమి? యని యడిగెను. అంతులకు విష్ణుశర్మ కారణమీవ యనిన వేణుగోపాలశర్మ యతిసంభ్రమమున నేనా? నేనేమిచేసితి ననెను.

విష్ణు. ఏమిచేసితి నని యడిగెదవా? నీవేమిచేసినది యీవార్తాపత్రిక యందుఁ గలదు. నేనీ యుదయమున నీరాకకై వేచియుండ నమల యత్యావశ్యకముగ నన్ను రమ్మని కబురంపె. ఆమెతావునకుం జన నెల్లవిషయములును దెల్లమయ్యె. సోజనా భగవంతుఁడు నీపాపమునుండి నన్నుఁ గాపాడుఁ గాక. నాపుడు వేణుగోపాలశర్మ నిశ్చేష్టితుఁడయ్యె. విష్ణుశర్మ వార్తాపత్రికనుండి యిట్లుఁ జదువఁదొడంగెను.

సింహపుర వృత్తాంతములు. నిన్నటిదినమున నీపురమున కవలిభాగమున

నున్న చిన్నిరాయని పురమున నతిఘోరముగ వధజరుపఁబడెను. ఈపురి నివాసుఁడును విశ్వవిద్యాలయమునఁ బ్రసిద్ధిగాంచినవాఁడును నగు సుందరుఁడును నతని మిత్రుఁడును జిన్నిరాయని పురనివాసుండును నగుమదనుండును సంఘ సంస్కార విషయములను గుఱించి చెంతనుండు గ్రామముల నుపన్యసించి యింటికేతెంచునతి రాత్రికాలమున దారిలోఁ గొందఱు వారలఁ జంపునుద్దేశముఁ బైఁబడి ఘోరాయుధంబుల నిరువురఁ హింసించినటులను మదనుఁడప్పటిన మృతిచెందినటులను సుందరుఁడు స్మృతిహీనుఁడై క్రిందబడినటులను నాతఁడిపుడు సింహపుర వైద్యశాలయందున్నటులను, నతనిబ్రతుకు దుర్ఘటముగ నున్నటులున్న విని మిక్కిలిచింతించుచున్నారు. ఈవిషయమునఁ జిన్నిరాయని పురనివాసు లనేకు లిప్పటికే దండనాధికారులచేఁ బట్టుఁబడిరట. ఇంకననేకులు గౌరవనీయులు నీపురమునందున్న న్యాయవాదులుం గొందఱు నీఘోరకృత్యమునందుఁ గలిసినటులఁ దెలియవచ్చినదట. శీఘ్రముగ ననేకులం బట్టుబడఁగలరు.

నీయుద్యమము ఫలించెనా.

ఇప్పుడు వేణుగోపాలశర్మ నిశ్చేష్టితుఁడై యేమిచెప్పుటకు నోరాడక యూరక నిలుచుండెను. ఎట్టకేలకు ధైర్యము తెచ్చుకొని ఎవ్విధమున నైన శత్రునాశనము సమ్మతముగదా అనెను.

విష్ణు. ఏటికి సమ్మతము! నీబోటి కిరాతులకా?

వేణు. నాయనా? మన సంసార సుఖభంగమునకుఁ గారణభూతుఁడు సుందరుఁడు. అతని కృత్యములయం దన్నిటియందును మదనుఁడు తోడైయుండెడివాఁడు. అట్టివారియెడఁ గనికరముంచరాదు. నిజమూడునాసచే నన్నికష్టములు మఱచియుంటిని. ఇట్టిసమయమున నాకుఁ దోడైయుండక నన్ను విడనాడఁజూచుట ధర్మమా? అని కన్నీరుగార్చుచుఁ గుమారునిఁ గరంబులఁ బట్టుకొనెను.

విష్ణు. అయ్యా! వినుము. నీ యీకార్యమువలన గమలా శారదలు బ్రతికియుండుట దుర్లభము. ఇఁక నీవు సుఖముగ నుండఁదగును. నీకును నాకును నేటితో ఋణము తీరినదనుకొనుము. నీబాంధవ్యము నేనొల్లను నీప్రాయశ్చిత్తము నాకవసరము లేదు. నాయందుఁ దయగొని యీక్షణమున నన్నుఁ బాయుము. నీదగు కఠినహృదయమునకును బాపకర్మములకును భగవంతుఁడు నీకుఁ బ్రతిఫలమొసఁగుఁగాక. అని యాట నున్న తనగదిలోనికి బోయి ద్వారమును మూసికొనెను. వేణుగోపాలశర్మ యతిశోకాక్రాంత మానసుండై యేమియుఁదోఁచక వెలివడి తత్క్షణమున సింహపురమునకు బయనమైనవాఁడయ్యెను. దారియందంతటఁ వేణుగోపాలశర్మ యతిపరాకారుడై యొద్దియో యాలోచించుచుండెను. ధూమశకటము సింహపురముఁ జేరునప్పటికిని రాసను

యమయ్యెను. తిన్నఁగ నింటికిఁజని కవాటముల బంధించి యొంటిగ నటుంతిరుగుచు మాటాడుకొనుచుండెను. ఎట్టకేలకుఁ దన పేటికందీసి యందానినుండి యొకగాజుపాత్రమును వెలికితీసి చేతనుంచుకొని యిట్టులనఁ దొడంగెను.

హా! దండనాధికారులవలని భయమొక్క చింత బాధించుచుండ, కృష్ణశర్మకొ నోక్తులు నన్నుఁ జంపుచున్నవి. కుమారా! నన్ను విడనాడుట నీకు న్యాయమా? అవును. వేణుగోపాలశర్మ కుమారుఁడన్న నీకును నవమానముగదా! సుందరా! నీవే జయించితివి! హా! నేనెట్టిపాపిని! ఎట్టి మూఢుఁడను. ఇఁక నేను జీవించియు నేమి ఫలము? అవమానము దప్పదు. అని యాగాజుపాత్రమును నోటఁబెట్టుకొని యందున్న ద్రావకమును ద్రాగెను.

కొంత తడవిటునటు తిరిగి, క్రిందఁబడి యిటులార్వ నారంభించెను.

ఎవ్వరు మీరు? నన్ను లాగకుఁడు. త్రోయకుఁడు. నేను వచ్చెదను. అయ్యో! మదనా! ఏల యూరకచూచెదవు? ఈకంటకుల బారినుండి నన్ను రక్షింపుము. అయ్యో! చచ్చితి. చచ్చితిని.

ఇట్లు కొంత తడవఱచి ప్రాణములు విడిచెను. మఱునాఁటి యుదయమున దండనాధికారులు వేణుగోపాలశర్మ రాతిరి యిలుసేరినదెఱిఁగి వారికొఱకై యచ్చోఁ జేరిరి. దాని కవాటములు బంధితములై యుండెను. ఎంత యఱచినను నెవ్వరును ద్వారముం దెరువరైరి. పిదప వారు కవాటములఁ బగులఁగొట్టి లోనికిం జని కని నపు డాత్మహత్యచేఁ బ్రాణములఁ బాపుకొన్న వేణుగోపాలశర్మగారి కళేబర మతిఘోరముగఁ గ్రిందఁబడియుండెను.



# ఇరువదియెనిమిదవ ప్రకరణము.

## తానొకటి తలచిన దైవమొకటి తలఁచును

మదనునియందుఁ జిన్నిరాయపుర నివాసులనేకుల కసూయయున్నను వానిఁ జంపునట్టి ద్వేషము బాణాకోదండుల యాప్తబంధువులకుమాత్రము గలిగినది. కావున వానిని మరణము విన్నంతనె యాపురమున నల్లకల్లోలము గలిగెను. మదనుని సుగుణములెల్ల నపుడు ప్రఖ్యాతికి రాఁదొడంగెను. అతనిఁ జంపిన వారియందెవరును గనికరముంచక మరణదండనకుఁ బాత్రులఁ గావించిరి. మదనుని మరణము వినినంతనె యాతని జననియగు కౌసల్య భరింపరాని శోకమునఁ బ్రాణములు విడిచెను. తక్కినవారు మెల్లరు నిరపరాధియును ధర్మాత్ముఁడును నగు మదనుని గుణాతిశయమ్ముఁ దలఁచుకొని మిక్కిలి చింతాక్రాంతులైరి. మాతృసుతులపేర నొక యాలయము నిర్మించి వారల నందుఁ బ్రతిష్ఠచేసి పూజింపఁ దొడంగిరి.

సుందరుఁడు క్రమముగ కమల శారదలయొక్కయు, విష్ణుశర్మయొక్కయు నుపచర్యలచే స్వస్థుండాయెను. మదనుఁడు జీవించియుండఁగనె తనకున్న గ్రామవైరమువలనఁ బ్రాణాపాయము గలుగవచ్చునని యాలోచించి, తాను కాలముచేఁ జచ్చిన యెడల జరుగవలసిన కార్యముల నొక పత్రికయందు లిఖించియుంచెను. తనతల్లి జీవితమునకుఁ గావలసిన కొలఁదియాస్తిదక్క, తక్కిన తనయావదాస్తిచేఁ జిన్నిరాయని పురమున నిమ్నజనోద్ధారణమునకై యొక విద్యాలయము నిర్మింపఁబడవలెననియు నద్దానియందన్నిజాతుల బాలురకును బాలికలకును ధర్మార్థముగ విద్య నేర్పింపవలెననియు,నిద్దానికంతకు సుందరుఁడు కార్యనిర్వాహకుఁడుగ నుండవలెననియు, మదనుఁడు లిఖించెను. మదనుని యుద్యమము లరసినంతనె చిన్నిరాయని పురవాసులందఱు మిక్కుటముగ సుందరునకు సహాయులై విద్యాలయమును బూర్తిగావించి «మదనుని విద్యాలయము''ని నామకరణము గావించిరి సింహపురమందలి నిమ్నజాతులవారందఱు మదనుని దైవముగఁ గొలుచుచు నాతని విద్యాలయమునకుఁ దమ బాలురఁ బంపిరి.

తరువాతఁ గొన్నినాళ్ళకుఁ గమలా సుందరులును, శారదా విష్ణుశర్మలును బ్రహ్మసామాజిక పద్ధతులప్రకార మొండొరులఁ బరిణయమాడిరి. వారు రాజధానియందే యుండి యత్యున్నత పదవిఁ జేరిరి. ప్రతి సంవత్సరమును మదనుని మరణదినమున వారందఱును చిన్నిరాయని పురమునకుఁ జని యచ్చో మదనునిఁ బూజించుచుండిరి. సుందరునకు గలిగిన ప్రథమ పుత్రునకు మదనుని నామమిడిరి. మదనుఁడు చచ్చియును బ్రతికియేయున్నవాఁడు. అతని కీర్తి యాచంద్రార్కముగఁ బ్రపంచమున వర్ధిల్లు

యుండును. కాని వేణుగోపాలశర్మను దలంచువారెవ్వరును లేరు. తన బిడ్డల [illegible] నావేఁబడి, తాను జేసిన పాపకృత్యములకుఁ జింతిల్లుచు, నాత్మహత్య గావించుకొన్న యా వేణుగోపాలశర్మ యుద్యమము లేవి కొనసాగినవి? తానొకటి తలంచిన దైవ మొకటి తలంచును. ధర్మమే జయించును.

చదువరులారా! ప్రపంచమున న్యాయముగఁ బ్రవర్తించిన సింహాసనారూఢుల [illegible] ము లనేకములు గలుగుచుండును. ఎట్టికష్టములకును నెదురీదుక మనసు నుంచినవారె దినదిన ప్రవర్ధమానులై పాపులకుఁ మహానీయులు, పూజనీయులు.

సమాప్తము.



Printed by Gumpani Hanumantha Row, at the
Maruti Press, Bezwada.